# MAHAA PATHAM

*Collection of Poems*



*Author :*
*Adigopula Venkataratnam*
*Nagarjuna University*
*Guntur - 522 510*

*First Edition : July 1996*
*Copies : 1000*

*Cover Design : Srikanth Adigopula*

*For Copies :*
*Prajasakti Book House*
*Karl Marx Road*
*Vijayawada - 520 002*

*Visalandhra Book House*
*4-1-435, Vigyan Bhavan, Bank Street*
*Hyderabad - 500 001 - and all its branches*

*Price : Rs.* **20-00**

*Printed at : Sri Lakshmi Press*
*14/2 Arundelpet, Guntur*

*Cover Printed at : Vamsi Art Printers*
*Khairatabad, Hyderabad*

# దారి తప్పని బాటసారి

నాగభైరవ కోటేశ్వరరావు

చిలకమర్తివారి ఒక నవల్లో బాటసారి దారి పక్క ఆడుకొనే బాలుణ్ణి అడుగుతాడు 'ఈ దారి ఎక్కడికి పోతుందీ' అని. ఆ పిల్లాడు దిక్కులు చూచి 'ఈ దారి ఎక్కడికీ పోదు. నా పుట్టినప్పటి నుంచీ యిక్కడే ఉంది' అంటూ అమాయకంగా జవాబిస్తాడు.

స్వతంత్రం వచ్చి అర్థశతాబ్దం అయినా మన గొంగళీకి చలనంలేదు. ఇవాళ మన కన్నీళ్ళు మనమే తుడుచుకోవాలి. మన ఒయాసిస్ మనమే వెదుక్కోవాలి. మన కెథారిసిస్ మనమే గవేషించాలి. మన దారి మనమే కనుక్కోవాలి. కవి అడిగోపుల వెంకటరత్నమ్ ఒక బాట వేశాడు. ఒక ఆలోచన నిచ్చాడు. ఒక పథాన్ని పలికాడు. అదే 'మహాపథం'.

.....

ఇవాళ తెలుగు కవిత్వం అడ్రసు మార్చుకున్న మాట నిజం. రాజకీయాల కేకలూ, నినాదాలు కవిత్వరంగం మీంచి నిష్క్రమించిన మాటా నిజం. మూసకట్టు పద ప్రయోగ ధోరణులు మూతి ముడుచుకున్న మాట నిజం. అభివ్యక్తిరీతుల్లో అన్వేషణ మొదలై వైవిధ్యం వేయి ముఖాలతో విప్పారుతున్న మాట కూడా నిజం.

మనిషి అంతరంగం అపూర్వంగా నవ్యాతి నవ్యమైన రీతుల్లో లోతుల్లో ఆవిష్కరింపబడుతోంది. పొడిపొడిగా మారిన మానవ సంబంధాల ఎడారులను తడిపి, వాటిని సారవంతమైన మైదానాలుగా మార్చాలని యివాళ కవిత ఎడతెగని పోరాటంగా మారింది.

.....

చుట్టూ జరుగుతున్న సవాలక్ష అస్తవ్యస్త వ్యవహారాలను పట్టించుకోకుండా మనకెందుకులే అని ఉదాసీనం వహించి తమ లోకం చుట్టూ ఎల్లలు గీచుకొంటున్న మనుషులు ఆనాడూ ఉన్నారు. ఈనాడూ ఉన్నారు.

ఆనాడు మహాకవి తిక్కన అన్నాడు 'సారపు ధర్మమూ, విమల సత్యమూ పాపం చేతా, బొంకు చేతా చెడిపోతే, దక్షులైన వారు ఉపేక్ష చెయ్యకూడ'దని-

ఇవాళ అడిగోపుల కవీ అదే అంటున్నాడు. ఉపేక్ష అపేక్షణీయం కాదు. ఉదాసీనం కూడదు. ఒప్పరికించడం తప్పు. పారిపోవడం ముప్పు - పలాయనవాదం నేరం. 'ఒక వెలుగు నుండి, ఒక విశ్వాసం నుండి, ఒక సంకల్పం నుండి, ఒక సమూహం నుండి యివాళ ప్రతిఘటన అవసరం' అని -

తిక్కన సమాజానికి అడిగోపుల సమాజానికి ఆలోచనలో తేడాలేదు. ప్రతిఘటన ఆనాడూ వుంది. పలాయనవాదం ఈనాడూ వుంది.

తిక్కన దక్షుడు. అడిగోపులా దక్షుడే. ఇద్దరూ క్రాంత దర్శులే. ఆమాటకు వస్తే ప్రగతి పక్షాన వెన్నుదన్నుగా ఆలోచించే ప్రతివాడూ క్రాంతదర్శే.

అడిగోపుల క్రాంత దర్శిత్వం 'మహాపథం' నిండా పరుచుకొని కవిత్వంగా ప్రవహించింది.

ఆప్తత పోటీపడిన కథనం ఇది. ఇలాంటి కవితలే కవిని చిరంజీవిని చేస్తాయి.

కొన్ని గుండెలు పిడికిలంత కాక భూగోళమంత ఎందుకవుతాయో, ఒక పరికివేతకు వేయి జననాలు ఎలా జవాబు చెబుతాయో, ఈ పేజీల మధ్య ఆలోచనల సాక్షిగా మనం గుర్తించవచ్చు.

'ఒకడ్ని వెంటేసుకుని
ఒకడ్ని వెంటాడుతుంది రాజ్యాంగం'
'అందరి శ్రమసౌందర్యాన్ని
కొందరికి పంచడమే ప్రణాళిక'

అంటున్న అడిగోపుల కవి అంతరాత్మకు ఎంతటి పరిశీలనాశక్తి ఉందో ఊహించగలం.

అందుకనే -

"ప్రపంచాన్ని కొనుక్కొంటూ అమ్ముకుంటూ
ఆడుకొంటూన్న ఆటల మధ్య
మనం గాయాల్ని మోస్తున్నాం కదూ" అని ఎలుగెత్తుతాడు.
'కలంపాతదే - కొత్త మార్గం రాస్తుంది
అల పాతదే - కొత్త రాగం తీస్తుంది
చెట్టు పాతదే - కొత్త విసురు వేస్తుంది'

అంటూ వెంకటరత్నమ్ 'మహాపథా'న్ని సాహిత్యలోకంలో పరిచారు. కొత్తదనాన్ని పలికించారు. కొత్త రాగాన్ని చిగురించారు. అందుకే 'ఆ అక్షరం, ఆ మాటా, ఆ కలం, ఆ గళం' విజేతలయాయి.

.....

జీవితంలోనూ కవిత్వంలోనూ సిన్సియారిటీకి ఎంత విలువుందో సినారెకి తెలుసు. చిరంజీవి వెంకటరత్నానికి తెలుసు. శిల్ప సుందరం కానిదీ, జీవిత సంపర్కం లేనిదీ - కవిత్వం ఎంత గొప్పదయినా నిరుపయోగం అనే సంగతి ఆరుద్రకి - ఆతడి ఏకలవ్యుడు అడిగోపులకీ తెలుసు.

అడిగోపుల కవిత్వంలో ఆతప తీవ్రతా వుంది. ఆమ్ర ఫలపు రుచీ వుంది. తీవ్రత భావానిది. రుచి శిల్పానిది. అడిగోపుల కవిత్వంలో విల్లంబు గురీ ఉంది. వైవిధ్యపు సిరీ వుంది. గురి గమ్యం కోసం. సిరి రమ్యం కోసం.

'మహాపథం' నిర్మించిన నా తమ్ముడి లేఖిని నుండి, మరో మహాకావ్యం దీర్ఘకవితగా తీవెలు దిద్దుకోవాలని మనస్ఫూర్తిగా కోరుతున్నాను.

ఒంగోలు
24-5-96

—నాగభైరవ కోటేశ్వరరావు

ఆత్మీయులు
నాగభైరవ కోటేశ్వరరావుగారికి,
డా. ఆకురాతి పున్నారావుగారికి,
రావెల సాంబశివరావుగారికి,

ఈ కవితల్ని ప్రచురించిన
ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి దిన, వార పత్రికల,
ప్రజాశక్తి, విశాలాంధ్ర దినపత్రికల,
ఆహ్వానం, స్రవంతి మాసపత్రికల
సంపాదకులకు......
హృదయపూర్వక కృతజ్ఞతలు

–అడిగోపుల వెంకటరత్నమ్

# కవితా క్రమం.....

# కళ్ళు నడుస్తున్నాయి

రోడ్డు నగ్నం, కాళ్ళు నగ్నం
మాట, పాట మాననివాడు నడుస్తుంటాడు
గాయపడ్డ రోడ్డు కాళ్ళను గాయపరుస్తుంటే
ఆలనా పాలనా లేని రెంటి
స్పర్శానుభూతి అనిర్వచనీయం!
కాళ్ళు తడబడవు, వేతులు పొరబడవు
ఎండిన కళ్ళు వేడి కన్నీటిలో స్నానిస్తే
అర్థరాత్రి అరుస్తూ లేచిన వాడి పేగులు
కడుపు దుప్పట్లో మెలితిరిగి మరణిస్తాయి!
అప్పుడప్పుడూ అరిగిన కాళ్ళు
మజిలీ చెప్పులు తొడిగి మళ్ళీ ప్రయాణిస్తాయి!
వాడి నడక సాగుతుంటుంది
అర్థరాత్రి ఫుట్‌పాత్‌పై
అప్పుడే పుట్టిన బిడ్డ యేడ్పు
తొమ్మిది నెలల గర్భరూప కారాగారానికి
ఉవ్వెత్తు ఆనందహేల
భర్త శవంపై భార్య యేడ్పు
ఇన్నేళ్ళ సహజీవనానికి
పోటెత్తిన సముద్ర ఘోష
సత్తు గిన్నెలో కూలిగింజలు ఉడికిస్తూ
చిదుగుల పొయ్యికి నోరు ఊదరగొట్టం
నయాగరాన్ని మరిపించే పొగబారిన కళ్ళు!
ఫుట్‌పాత్‌లు...
జీతభత్యాల్లేని జనన మరణ రిజిస్ట్రార్లు

మనసు, మానవత్వం నిండిన
మంత్రసానులు, కాటికాపరులు
దారిద్ర్యరేఖను సమతుల్యంగా లెక్కించే
గణాంక శాఖాధిపతులు!
వాడు నడుస్తుంటాడు
చుట్టూ వినోదాలు, పట్టుచీరలు, పరికిణీలు
ఆకాశంలో కార్లలాంటి విమానాలు
భూమిపై విమానాల్లాంటి కార్లు
కేరింతలు, కట్నాలు, కానుకలూ
వెలుగులో కొవ్వొత్తుల కాంతులు!
నవ్వుకు నవ్వు తోడై ఆనందం జోడై
పగటి వెన్నెట్లో జగమే ఊయల!
మాట, పాట మానని
వాడి "వాడి" చూపు నడుస్తుంది
కాలివేళ్ళు నోళ్ళై ఎలుగెత్తితే
చేతి వేళ్ళు నగారాలై మోగుతాయి!

# రగులుతున్న నిప్పురవ్వ

హోల్ సేల్‌గా ఊరి అవమానాలు మోస్తూవాడ
రిటైల్‌గా బానిసత్వం తింటూ నేను
ఆజ్ఞ నీది ఆచరణ నాది
నిర్ణయం నీది నిర్వాకం నాది
తలాడిస్తూ తలొంచుకు పోయేవాడికి
నోరుందని నాకు తెలియదు
నాకు మాటతో పనేముంది!
నెలపొడుపు రూపమై విల్లులా వంగిన నాకు
నిటారుగా వెన్నెముక నిలుపుతుందని తెలియదు!
వారసత్వం తెచ్చిన బానిసత్వంతో
నమ్రతతో నమస్కరించడానికో
కష్టించి నట్టింట రాసులు నింపడానికో
చేతులు పుట్టాయి గాని
కత్తులుగా పని చేస్తాయని తెలియదు!
పక్షుల రామందాడికి వడిసెల విసుర్తూ
నిన్నటికి నిన్న మంచెపై నా గర్జనకు నేను
ఒక్కసారి ఉలిక్కిపడ్డాను
ఆమడ దూరాన ప్రతిధ్వనించే గొంతును ఆలకించి!
వచ్చిన గిత్తను ఒంటిపొడికి కట్టిమోస్తూ
చెమటలు కక్కిన నా ఒంటిని చూసి
ఒక్కసారి ఉలిక్కిపడ్డాను
ఎలక్ట్రిక్ స్తంభంలా వెన్నెముక నిల్చివుండడం చూసి!
నిలువెత్తు నీ అహంకారానికి నిండైన చెప్పులు కుడుతూ
ఆరె అమాంతం దూసుకుపోవడం చూసి

ఒక్కసారి ఉలిక్కిపడ్డాను
చేతులు కత్తుల్లా దిగడం గమనించి!
నేటికి నేడు
నన్ను చూసి నివ్వెరపడి
నువ్వు ఉలిక్కిపడ్డం
నేను గమనిస్తున్నాను!

# అందరూ కలిసి...కదిలి....

ఎవరి బాధలు వారికే పరిమితం కావు
ఎవరి ఉద్యమం వారికే కేంద్రీకృతం కాదు
ఒక్కడి కోసం అందరూ-
అందరి కోసం ఒక్కడూ-
ఒక చేతిని కబళిస్తున్న ఒకే మేని రెండో చేయి
ఒక పాదాన్ని భూస్థాపితం చేస్తున్న ఒకే మనిషి రెండోపాదం
మర్రికింద మల్లెతీగ-దీపస్తంభం కింద నిరంతర తిమిరం!
స్త్రీవాదం స్త్రీయే బలంగా ఆవిష్కరిస్తుందనే తర్కం
దళిత కవిత్వీకరణకు దళితేతరుడు అనర్హుడన్న వాదనం....
రెండు కళ్ళ సమదృష్టి ఫలితం పూర్ణబింబ దృశ్యం
రెండు చెవుల సమన్విత కృషి పరిపూర్ణ శ్రవణం!
నేను నీ పోరాటానికి అంకితం అంటున్న పురుషులు
వర్ణ వివక్షతను తెగనాడిన అభ్యుదయవాదులు
నేటి బహిష్కరణ జాబితాకు చేర్చబడ్డ సమతా మూర్తులు
కులం పునాదులు, చీలిన ఉద్యమాలు
మానవతా హర్మ్యాల్ని నిర్మించవు
నదికి సమాంతరంగా మరోనది త్రవ్వకం పరిష్కారం కాదు
స్త్రీ పీడన ఛేదనం స్త్రీదేకాదు - పురుషుడిదీ
దళిత పీడన పరిష్కారం దళితుడిదే కాదు-అగ్రవర్ణానిదీ!
నడిచే దారికి అందరూ ఒక్కటే
నడిపే వారికి కొందరే ఒక్కటి
చీలిన భారత స్వాతంత్ర్యోద్యమం
రెండు దేశాల ఆవిర్భావానికి పునాది
పంజాబు మారణహోమంలో ఒక మతం శలభం

కాశ్మీరు అగ్నిగుండంలో ఒక మతం సమిధ
కులాల కురుక్షేత్రంలో ఈశాన్య జాతుల్ని ఉడికిస్తున్న కుంపటి
రామ్మోహనరాయ్, గాంధీ, శరత్, గురజాడ
కందుకూరి, ఉన్నవ, చలం....
అన్ని ఉద్యమాలకు అంకితమూర్తులు!
ప్రాణాన్ని పంచుతూ
మానాన్ని పెంచుతూ జనజీవనం మధ్య సాగిన జీవనది
శాఖోపశాఖలై రూపరహితమై
సముద్ర దాహానికి దోసెడు మంచినీళ్ళైన దుస్థితి
చీలిన ఉద్యమానికి సహేతుక ఉదాహరణం!
బాధా పీడితుడు బాధను వర్ణించగలిగినా
బాధా ద్రష్ట చైతన్యం, స్పందన, సామాజిక స్పృహ
బాధా తప్తుని మించి బాధను శక్తిమంతంగా చెప్పగలదు
సౌరకుటుంబాన్ని శతావధానం చేస్తున్నవాడు
నేలపై నిలిచిన ఖగోళ పండితుడు!
ఎవరి శవపేటికను వాళ్ళ రక్తసంబంధం మోస్తున్నా
ఎవరి శవపేటిక వాళ్ళ తయారీ మాత్రం కాదు!
ఒక స్త్రీ విముక్తికి ఒక పురుషుడు
ఒక దళిత ఉద్ధరణకు ఒక అగ్రకులస్థుడు
ఉద్యమించిన సమూహాన్ని భావితరానికి అందిద్దాం
అందరూ కలిసి కదిలిన ఉద్యమ చరిత్రను రాసుకుందాం!

# జీవనస్రవంతికి స్వాగతం

నువ్వు వివాహితవో అవివాహితవో నాకు తెలియదు
అమరశిల్పి జక్కన్న చెక్కిన అపురూప శిల్పానివి
నీ మేలి వన్నెముందు సూర్యుని స్వర్ణకిరణం రంగు వెలుస్తోంది
నీ చంద్రబింబ రూపంపై నిసి నీడల నేపథ్యం తెలియదు!
సంకల్పితంగా రైలుకింద చాచిన నీ తలను
అసంకల్పితంగా తప్పించిన నాకు నీ చిరునామా తెలియదు
నాకు తెలిసింది ఒక్కటే
నువ్వు అబలవు, బేలవు, అంతకు మించి పరాధీనవు
వేధింపో, బాధింపో
మూడు ముళ్ళ సాధింపో నాకు తెలియదు
నాకు తెలిసింది ఒక్కటే
నీది ఆత్మహత్యా ప్రయత్నమని!
ఒకరికి చెల్లివి, భార్యవు, తల్లివి
అంతకు మించి నువ్వు ఒక దేశానివి
ఒక మేఘానివి, నదీ ప్రవాహానివి
సముద్రానివి, అనంత విశ్వానివి
సంజీవని గర్భంలో దాచుకున్న
ఋష్యమూక పర్వతానివి!
భిన్న సంస్కృతుల్ని పెనవేసి
భిన్నత్వంలో ఏకత్వం నాటి
నదివై ధరిత్రిని పునీతం చెయ్యాల్సి వుంది
మేఘమై అనావృష్టి నేలపై అభాగ్యుల గొంతు తడిపి
ఋతువును ఆవిష్కరించాల్సివుంది
కష్టాలొచ్చిన ప్రతివారూ మునకే సుఖమనుకుంటే

మూడు సముద్రాల మధ్య భారతం
మరో సముద్రంగా మారిపోయేది
బాధ ఆత్మహత్యకు అంకితమైతే
పట్టాలు నడిచినంతమేర పట్టణాలు పల్లెలు వుండేవి కావు!
బుద్ధుడు పుట్టి తిరిగిన యీ పుణ్యభూమిలో
కన్నీరొలకని ఇల్లేకనపడలేదమ్మా
సూర్యరశ్మి సోకనినాడు
పిండిపదార్థం వండుకోలేని చెట్టుకూ
పలు కష్టాలూ ప్రారంభం
ఆత్మహత్యకు పాల్పడిన దాఖలాలు
పశుపక్ష్యాదుల్లోను, జలచరాల్లోనూ లేవు!
స్త్రీ పుష్పేకాదు నిప్పుకూడ
నవనీతమే కాదు కఠినశిలకూడ
పిపీలమే కాదు హిమవత్పర్వతం కూడ!
చీడ ఎప్పుడూ చిగురుకే నమ్మా
ఎదురు రాయి ఎప్పుడూ నడకకేనమ్మా
తనభారం, జనభారం తలకు మించి మోస్తున్నరైలు
ఎప్పుడూ ఆత్మహత్యకు పాల్పడలేదు
నీ ప్రాణం నీదికాదు....అందరిదీ!
తిమిరం తొలగిన నిప్పు
జనజీవన స్రవంతికి స్వాగతిస్తూ
ఇక నేను నిష్క్రమిస్తాను!

# మహాపథం

చనిపోయిన వాడు, పుట్టని వాడు తప్ప
సత్పురుషుడెవ్వడూ లేడని సమస్యల్ని విడనాడి
చేతుల్లేని చప్పట్లు చరిచి
పారిపోవడం పలాయనవాదం!
పల్లవించిన మోడును వాడి పొమ్మందామా
తుళ్ళిపడి పారే సెలయేరును ఆగిపొమ్మందామా
వర్షించబోయే మేఘాన్ని పారిపొమ్మందామా
నెత్తిన దుప్పట్లు పరిచి
సూర్యకాంతిని అడ్డుకుందామా
వాటిని వశంచేసి ఆవిష్కరించుకుందామా...!
కాడెత్తగానే కర్తవ్యం గుర్తించి
అరుమోపిన ఎద్దును గుర్తుంచుకుందాం
చెట్టూ పుట్టా తిరిగి గూట్లో పిల్లలకు
కడుపు నింపిన పక్షిని జ్ఞప్తించుకుందాం!
ఒక ఇటుక పేర్చడానికి
ఎన్ని చేతులు శ్రమించాయో
ఒక రోజుగా మారడానికి
ఎన్ని గంటలు కరిగిపోయాయో
పనిముట్టుగా మారడానికి
కరిగిన ఇనుము మార్గదర్శకం!
నిజమే....
"నిన్న" అతడి స్వంతం
"నేడు" అతడి ఆటబొమ్మ
ఒక వెలుగు నుండి, ఒక విశ్వాసం నుండి

ఒక సంకల్పం నుండీ, ఒక సమూహం నుండి
"రేపు" అందరికోసం
నేడు అందరి ప్రతిఘటన!
రెండు సముద్రాల్ని కలుపుతూ
ఒక మానవ నిర్మిత కాలువ
రెండు సముద్రాలూ ఒకటిగా మారిన దృశ్యం!
పలాయనం పాటకు కోరస్ పాడకు
నిష్క్రమణకు దారిలేదు
స్వప్నావిష్కరణ జాగుచేయకు
పలాయనానికి తావు లేదు
మహోపథం నిర్దేశించు....

# తొలకరి చినుకు

శిశిరం చేరువైన ఆకును నేను
ఎనభై యేళ్ళ బోసి యేడ్పుల
అడ్డాల బిడ్డను
బతుకు బాధల కేంద్రమై
మరో ఎనభై వసంతాలు నెత్తికెక్కిన
అనుభవాన్ని నేను!
విదేశీ అప్పులో సగటు భారతీయుడి చిత్రం
తెర తొలగిన రంగస్థలి
ఒకడి కష్టార్జితం ఒకడి ఆదాయానికి
జమపడడం తెరవెనుక నేపథ్యం
తార్చడం, హతమార్చడం
రక్త సంబంధాల్ని, మమతాను బంధాల్ని
భాగించడం, తెంచడం
డబ్బు చేసే పని
డబ్బున్న వాడి చేతిపని!
అద్దాల మేడలో అధిష్టించిన
కన్నకొడుకు వెనుకానుక
నా మూడు కాళ్ళ మంచం!
మదర్ థెరిసా....మదర్ థెరిసా
ఊరూరా పాదయాత్ర చేసి
ఇంటింటా మానవసేవ పండించాలి!
హుయాన్‌త్సాంగ్ .... హుయాన్‌త్సాంగ్
నువ్వు చూసిన భారతంలో నన్ను చూసి
అసలు చరిత్రకు అనుబంధించాలి!
సోషలిజమా....సోషలిజమా

నిత్యం హోరెత్తి పైపైకి ఎగిసిపడే సముద్రాన్ని
నేల ఓర్పుతో నేర్పుగా తిరుగుముఖం పట్టించడం
నిత్య అప్రమత్తత
నిరంతర భద్రత-
ఆకాశానికి నిచ్చెనవేసి
నక్షత్ర బల్బులకు బూజు దులిపినవాడు
పాకుడు రాళ్ళుపట్టి పాతాళగంగను పైపైకి తెచ్చినవాడు
బతుకంతా అణువుల్ని
వెతుక్కోవడమే గాని కలుపుకోనివాడు
నమ్మకం నమ్మి చేసుకున్ననాడు....
విశ్వాసం అభిషిక్తమై
కొమ్మల రెమ్మలకు పుట్టిన చివుళ్ళలా
కర్తవ్యాలు వేటికవే పుట్టుకొస్తాయి!

# చిరునామాలేని వర్తమానం

ఒళ్ళంతా గాయాలు
ఒక్క రక్తం బొట్టూ రాలదు
పోస్టుమార్టంకందని హింస
మొండెం కనపడ్డచోట తెగేసిన తలమాయం
అంతర్ముఖఖేదం!
రాత్రి రాత్రి మధ్య పగలు వంతెన
వెలుగుబాట నిశీధి వెల్లువలో మునక
చిరునామా లేని వర్తమానం!
ఒక పలకరింపు ఎత్తుగడ
ఒక నడక ధనార్జన
ఒక కలయిక స్వార్థం
ఒక ప్రేమ హత్య
మరుగుజ్జు ఆలోచనే మస్తిష్కానికి తురాయి
కాళ్ళు మట్టిని కసిగా నలుపుతూ హేల
మట్టి మనిషౌతుంది, మనసౌతుంది
పలుకౌతుంది, ప్రజాగర్జనౌతుంది
మట్టి చిరంజీవి!
మట్టి వంటపాత్రవుతుంది
మేఘం పంటకాల్వవుతుంది
మానవ కళ్యాణానికి-
మానవుడి దానవరూపం
మారణ హోమానికి-
చిగురును కన్న చెట్టుకు మంత్రసాని లేదు
ఆచ్ఛాదన లేని బతుకుల ప్రసూతి అంతే

సూర్యుడ్నీ చంద్రుడ్నీ వెండి పాల గ్లాసులో
తాగే బతుకుల మధ్య
దోసిలి నీళ్లలో వాళ్లని ముద్దాడే
చరిత చరిత్రహీనం
వర్తమానంలో హంసలు వలసపొయ్యాయి
క్షీరం నీరం ఒకటయ్యాయి!
వీడ్కోలు, స్వాగతం
విషాదం, ఆనందాల మధ్య
రైలు పాడే అవిశ్రాంత ఛుక్ ఛుక్ పాటకు
నిత్యం తాళం వేస్తున్న రైలు పట్టాల స్పందన
అలిసిన మనిషికి...అలుపెరుగని సందేశం!

# చలిచీమల మధ్య సర్పం

కేవలం రెండే రెండు చేతులకు
ఎంత నేపథ్య కవచముందో
వేనవేల చేతుల్ని పేరు చెప్పి దోస్తుంటాయి!
గూట్లో సంపద దాచుకునే మనుషుల ముందు
బొడ్లో నాణెం దోపుకునే బతుకులు మావి
బొమ్మలన్నీ ఒక పక్కకు చేరిన నోట్లకట్ట ముందు
బొమ్మ బొరుసూ భేదం తెలియని చిదుగులం
దొర్లిపోతున్న భూగోళం అడుగున
నలిగిపోతున్న రహదారులం!
చెదిరిన జ్ఞాపకం ఏరుకుని అమ్మ అంటుంది
ఎనిమిది నెల్లకే నవమాసాలు నిండి కనేసి
వొళ్ళారక ముందే పసిగుడ్డును వదిలేసి
కూలికెళ్ళి కడుపు నింపానని-
ఉయ్యాల తాడు కొనుక్కునే లోగా
తప్పటడుగుల్లో నేను పడ్డానని
ఉగ్గు గిన్నెకు మాటువేసుకునేలోగా
అన్నప్రాశనం జరిగిపోయిందని-
అద్దంలో నన్ను నేను చూసుకుంటాను
నాది కాని భీకర మానవాకారం చూస్తాను
మాపును క్షణకాలం సంశయించి, సంభాళించి
కళ్ళు మూసి, తలవిదిల్చి
నన్ను వెతుక్కునే యత్నంలో సావధానమయ్యేలోగా
నా చేతిలో అద్దం మాయం!
వేలంపాటలో వస్తువునై

చుట్టూ చేరిన జనం హెచ్చుస్వరంతో కేకలు
నేను నక్షత్రకుడి చేతిలో హరిశ్చంద్రుడ్ని-
అప్పు తీరదు, చాకిరి ఆగదు, పూటగడవదు
ప్రశ్నయిప్పుడు నాలో జీవం పోసుకుంది
గడ్డిపోచలు కలిసి ఒక ఎంటౌతుంది
ఎంట్లు గొలుసుకు దీటౌతాయి
చలిచీమల చేతచిక్కిన సర్పం
ప్రతిఘటించి ఎంతదూరం పాకుతుంది?
నడిచిన దూరం నడకకు పట్టిన కాలం
లెక్కించి చిత్రించి
రేపటి పాఠ్యాంశమై రూపొందాలి!

# బతుకు ఎడారిలోంచి

మృగాల్ని బోనుల్లో బంధించాక
డేగల్ని పంజరాల్లో బిగించాక
సర్పాల్ని బుట్టల్లో దాచాక
జనారణ్యంలో యింకా సశేషాలు
దీపం వెలిగితేనే వెలుగు వెల్లువ తాకినట్టు కాదు
చినుకు తడిపిన నేల వెలుగు
చిగురు వేసిన కొమ్మ వెలుగు
అక్షరం నేర్చిన మెదడు వెలుగు!
రాచరికాన్ని మోసిన నిన్నటి రోడ్లపై
ప్రజాస్వామ్యం నేడు పరుగెడుతూ వుంది
సప్తసముద్రాల కావల
సౌరకుటుంబానికీవల
రేపటి మరో ప్రపంచం దాగిలేదు
మన ముందు మొలకెత్తినదే మరో ప్రపంచం
మన ముందు సాగినదే మహాప్రస్థానం
నీరు ఘనీభవించిన చోట
రాయి ద్రవీభవిస్తుంది... పద... పద
విప్లవాశయాలు
దృఢసంకల్పాలు కప్పుకుని నడుస్తావు...
అరణ్యాల్లోకి, పర్వత పంక్తుల్లోకి
జన సముద్రాల్లోకి, జల సముద్రాల్లోకి-
పతితులు, పీడితులు
గాయాలు మోస్తున్న వాళ్ళు, గొంతులు తెగినవాళ్ళు
కొండల్లోంచి, శిధిలాల్లోంచి

ఎడారుల్లోంచి, రిక్తహస్తాల్లోంచి
సమూహాలకు సమూహాలై నీవెంట నడుస్తారు
నగ్న సూర్యుణ్ణి నెత్తికెత్తుకుని-
విజయకేతనం ఆవిష్కరించి సాగుతుంటావు
ఎగరేసిన బావుటా వెంట వాళ్ళు నడుస్తుంటారు
పాల పుంతల్లోంచి, పసిడి రాసుల్లోంచి
వెలుగు వెల్లువల్లోంచి-

# ఉద్యమం విత్తుకోవాల్సివుంది

రేపటి మీద ఆశనాకు
తొడిగిన మొగ్గలు వికసించే రోజు!
మృగతృష్ణను మోసుకొచ్చి
దాటనివ్వని అగడ్తయిన వర్తమానంలో
ముంతలు పట్టి నిలుచున్న మరుగుజ్జు జీవితాల పట్ల
కుళాయిల ఈసడింపు
కాలినడకల పట్ల కార్ల పరుగుల ఏవగింపు
స్పీడు బ్రేకర్లైన అవయవ ఖండాల్ని దాటుతూ
వాహనాలు ఆగేది ఒక్క ఇంధనం కోసమే
స్వర్ణ స్వప్నాల సజీవదహనం!
ఎవడి రుగ్మతల్ని వాడే రాసుకుని
మూర్ఖబిళ్ళలా మెళ్ళో వేలాడ దీసుకున్నాక
రోగ నిర్ధారణకు వేరే వైద్యుడెందుకు?
వెదు మాట్లాడనని
నోరు మూసుక్కూర్చున్న కోతి
వెదు వేష్టలకై కంటి నోటితో ప్రేరేపిస్తుంది
కాళ్ళు చేతులు కళ్ళు కర్తవ్యాల్ని ప్రసరిస్తున్నప్పుడు
భాషతో మనిషికి నిమిత్తమేముంది?
మూడోనెల పిండంలా
రూపంలేని వర్తమానం!
మనిషి పాలిట వెట్టి విద్యుత్తు లేని పంకా....
నీడ నిచ్చే కట్టని సౌధం
మనిషి పాలిట మనిషి మృత్యుకుహరం!
కాళ్ళకింద గోపురం వుందని కలశానికి ఎంత అహంభావం

గోపురమే లేనప్పుడు కలశం ఎక్కడిది?
ఆశ చనిపోయిన క్షేత్రంలో
నిరాశ మొలకెత్తుతుంది
ఇప్పుడు అందరూ కర్షకులై దుక్కిదున్ని
ఉద్యమం విత్తుకోవాల్సి వుంది
మెరక ఎక్కడానికి నీరు పల్లంలో పడిలేచే దృశ్యం
నిరంతర జ్వలనమై మనస్సుల్లో నిల్చిపోవాలి!

# మనిషి మహాయుధం

మనిషి ఒక మహాయుధం
సాలార్ జంగ్ మ్యూజియంలోనో
చెన్నపట్నం చచ్చిన కాలేజిలోనో
మరో పురావస్తు ప్రదర్శనశాల్లోనో
నిద్రించే ఆయుధాల్ని నా ముందు ప్రదర్శించి
ఏ మనిషి ఏ మహాయుధమని ప్రశ్నించినా-
ఏ ఎ.కె. ఫార్టీసెవనో
ఏ రాకెట్టు లాంచరో
ఆవిష్కరించి అడిగినా-
నల్లని నా రూపు ఎర్రబడి ఉరుముతుంది!
పుట్టినగడ్డ పరాయీకరణై....
రాష్ట్రావతరణకు ఆత్మార్పణం చేసిన
అమరజీవి పొట్టి శ్రీరాములు
ఆయుధాన్ని మించిన ఆయుధం!
వారసత్వపు బానిసత్వం
తరతరాల దారిద్ర్యపు గూట్నించి
భూమికోసం భుక్తికోసం
తిరగబడ్డ దొడ్డి కొమరయ్య
వీర తెలంగాణా విప్లవ పోరాటానికి ఆద్యుడు
ఆయుధాల్ని ఎదురొడ్డిన ఆయుధం!
నేలనాది, నీరునాది
పంటనాది, పచ్చికనాది
పుల్లరేమిటి ప్రజాకంటక శాసనమేమిటని
ఉద్యమించి తిరగబడ్డ

కన్నెగంటి హనుమంతు
ఆంగ్లేయుల గుండెల్లో నినదించిన ఆయుధం!
చాంధస భావాల్ని పూడ్చి
సాంఘిక దురాచారాన్ని
స్త్రీ జాతి హేయస్థితిని మార్చిన
సంస్కరణ ప్రదాత
వైతాళిక కందుకూరి ఒక మహాయుధం!
నింగిని నేలపై పరచడం
నేలపైన మనిషి నింగిని తాకడమే....
మనిషి ఒక మహాయుధం!

# ఆమని రాబోయే కాలం

గాలికి సుతారంగా వూగిపోతూ
పందిరి పట్టుకై పైపైకి పాకే
మేలిమి బంగారు తీగను చూశాక
ఎడారిలో హరిత విప్లవం నింపి
సస్యశ్యామల క్షేత్రాల మధ్య
చిరుమువ్వల సవ్వడితో సాగి
సముద్రసంగమం చేస్తున్న నదిని చూశాక
శరత్కాల నీలాకాశంలో ధవళ వస్త్రధారిణులై
తిరుగాడే మేఘమాలికల్ని చూశాక-
ఆమె గుర్తొస్తుంది!
అంతేకాదు.....
బ్రద్దలైన అగ్నిపర్వతం లోంచి ఆకాశానికంటిన
భీకర లావాజ్వాలను చూశాక
మధ్యందిన మార్తాండుడు
ఉష్ణరక్త హృదయంతో ఉడికిపోవడం చూశాక
చండప్రచండ కాళిక చేతిలో
ప్రజాకంటక మహాసుర సంహారం చూశాక-
ఆమె గుర్తొస్తుంది!
అంతేకాదు.....
అర్థరాత్రి అసహాయ ఆర్తనాదం విన్నాక
పొంచిన పులి పంజాకు లేడి చిక్కాక-
ఆమె గుర్తొస్తుంది!
అంతేకాదు.....
ఆమె పలకరిస్తుంది

దురాకృత లోకంలో
మానం, ప్రాణం పోయినందుకు దుఃఖిస్తుంది
జనారణ్యంలో పులుల స్వైర విహారాన్ని
అరికట్టనందుకు ప్రశ్నిస్తుంది!
ఒకడు పదవి పంచేవాడు
ఒకడు పదవి పొందేవాడు
ఒకడు పదవి అందనివాడు
ఆరోహణ అవరోహణ
అవరోహణ ఆరోహణల మధ్య
భిన్న ధృవ సంపర్కం
ఆటవికుల ఆవిర్భావం!
ఆకులు రాలడం చూసి ఆకురాలేకాలం అనను
ఆమని రాబోయే కాలం అంటాను!

# ఏడో ఋతువు

మనిషి ఒక్కడే
వెనువెంట వేల తుపాకీలు
మారణాయుధాల మహాసైన్యం మధ్య
మనిషి మహాబలవంతుడు!
మనిషి ఒక్కడే
బొమ్మ బొరుసూ అతడే
దోషి నిర్దోషి అతడే
బింబం ప్రతిబింబం అతడే
హతుడు హంతకుడు అతడే
హత్య నిజం, శవం నిజం
హతుడి చిరునామా పచ్చినిజం
హంతకుడి ఆచూకి అంతుబట్టని నిజం!
నెత్తురు ఘనీభవించిన నదీ తీరాలపై
బారులు తీరిన లోహవిహంగాలు
నిన్నటి గాయం నేడు మచ్చ
రేపు మటుమాయం
రోజులు రాలాక మాసం
మాసాలు రాలాక సంవత్సరం
జ్ఞాపకాలపై కాలం
మరపుమరకల అద్దకం
కాలానికి మారాకు!
నేను గుండె నిండాగాలి పీలుస్తున్నాను
ఊపిరితిత్తులు ఆహ్వానిస్తున్నాయి
నేను బింబం, ప్రతిబింబాల్ని చదువుతున్నాను

మెదడు స్వాగతిస్తోంది!
న్యాయస్థానంలో న్యాయదేవత తులాభారం
ధర్మకాటా మరమ్మత్తుకై
తూనికలు కొలతల శాఖకు తగలిస్తున్న సందడి!
మనిషి చిరంజీవి
మనసు సంజీవి!

# రెండు యాభైలు వంద కాదు

పుట్టింటిని వూడ్చి చీపురు పుల్లనూ మెట్టినింటికి చేర్చినప్పుడు
ఆపద గట్టెక్కడానికి ఆభరణాలు తాకట్టుకు యిచ్చినప్పుడు
ప్రతి రాత్రి శయనేషు రంభగా మారినప్పుడు
నీలో సగం నేను
నాలో సగం నీవు!
నాలో జీవనదులుండి హరిత క్షేత్రాలున్నాయి
మెదళ్ళుండి చిగిర్చే ఆలోచనలున్నాయి
కోరికలుండి అమృతభాండాలున్నాయి
పరిశ్రమలున్నాయి
శ్రమ సౌందర్యాలున్నాయి
వాటిని దోస్తావు దాస్తావు
వంచించి జయిస్తావు
ఆక్రమించి అధికృతం చేస్తావు
ఆకాశంలో సగం నువ్వు సగం నేను
అయినా సంపూర్ణ ఆకాశం నీదే!
ఇల్లు వూడ్చేటప్పుడు
పొత్తిళ్ళు మార్చేటప్పుడు
రోగ పీడితుడవై నువ్వు మంచానికి అల్లుకపోయినప్పుడు
వంటింటి కుందేల్ని నన్ను నేను కోసుకుని వండుకునేటప్పుడు
ఆకాశం అంతా నేనే
ధరిత్రి నిండా నేనే!
ఆదిశేషువు అలిసినప్పుడు ధరణిని మోస్తున్న మూర్తిని నేను
చండసింహం అధిష్ఠించిన ప్రచండ కాళికను నేను
నూరో నంబరు గుడ్డలా తేలికైన శ్వేత మనస్విని నేను

తల్లి కడుపున కదుల్తూ వుంటే
నడక నేర్చుకుంటున్నావనుకుంటుందిగాని
కబళించడానికి ఎత్తులు వేస్తున్నావనుకోదు!
రోజులో సగం నువ్వు సగం నేను
సగంలో పగలు నువ్వు చీకటి నేను
సగం సగం కలిపి
ఈక్వేషన్ వేస్తున్నా
ఎంతకూ ఫలితం రాని ఒకటి కోసం
యుద్ధం ప్రకటిస్తున్నా...

# ఉరికొయ్యల ఉరి

మనం నిత్యపథికులం, శ్రామికులం, కర్షకులం
సముద్రాల్ని అంగల్తో దాటి ఆకాశాన్ని నిముషాల్తో కొలిచి
కొండల్ని పిండిచేసి లోయల్ని చదునుచేసి
కథ కంచికి మనం ఇంటికి వెళ్ళే నిరంతర శ్రామికులం!
నారుపోసినవాడు నీరుపోస్తాడనడంలో అశక్తత
వధ్యశిలపై తలవాల్చి ఈశ్వరేచ్ఛ అనడంలో అసమర్థత
సమగ్ర సంక్షిప్తంగా ఒకే మాట అవివేకం!
భాష నేర్చావు, నడక నేర్చావు
రాతనేర్చావు, ఆలోచన నేర్చావు
అన్నీ పరాధీనమై
బానిసత్వం మోయడానికే సిద్ధం
పండు వెన్నెట్లో తిమిర వేదికపై
తలారుల, దళారీల వికటాట్టహాసం!
జీవితంలో సగభాగం నిద్రకు
సగభాగం మత్తుకు
నిత్య ప్రమత్త నిర్ధరకుడవై నిలవాలని ఏలినవారి కోరిక
నిద్రిస్తున్న ప్రభుత్వాన్ని మేల్కొల్పిన
వాడి హత్య ఒక సహజమరణం
వాడి ఎన్‌కౌంటర్ ఒక ఆత్మహత్య-
మరణం మాట్లాడుతుంది
పోస్టుమార్టం కథ అల్లుతుంది
గాలిపిచ్చిది
నిజం చెప్పి చెవి దగ్గర ధర్నా చేస్తుంది!
చూపు పసిది

బొమ్మ చూపి కంటి దగ్గర మారాం చేస్తుంది!
నీతి పొద్దుతిరుగుడు పువ్వు
బతుకు సశేషాల నవ్వులాట-
మనది బిళ్లకట్టు ప్రయాణం
మనది సామూహిక మరణం
మనది ఎక్స్‌గ్రేషియా బతుకు-
ఉరికొయ్యల సముదాయాన్ని ఒక్కుమ్మడిగా ఉరితీసే
పోటెత్తిన పిడికిళ్లేవి?

# మానని గాయాల మధ్య మనిషి

మనల్ని మనం అమ్ముకుంటూ కొనుక్కుంటున్నాం కదూ
వర్తకులు, దళారులు, దస్తావేజులు, రిజిస్ట్రేషన్లు
లాభసాటి, లాభరహిత లావాదేవీల మధ్య
తాకట్టు పడుతూ, విడివడుతూ వున్నాం కదూ!
నడుస్తూ, పరుగెత్తుతూ, ఆడుతూ గాయపడ్డం సహజం
కత్తితెగడం, బ్లేడు కోసుకోడం మామూలే
మందులు, పసర్లు, ఆహార నియమాలు, నాటువైద్యాల మధ్య
గాయాలు మానిపోతాయి, మాసిపోతాయి!
గుర్తులే మిగలవు
మిగిలినా గాయాల్ని జ్ఞప్తించవు
తినడం, శ్రమించడం, నిద్రించడాల మధ్య
నిత్యకృత్యాల అంతర్భాగాలవి!
గాయమంటే....
నీ కళ్ళెదుట జరిగిన ఎన్‌కౌంటర్ చూపాలి
చిత్రహింసల లాకప్ డెత్ చూపాలి
మానమంటేనే తెలియని మైనర్ బాలిక
సామూహిక మానభంగం చూపాలి
ప్రపంచ విపణిలో నువ్వు తాకట్టు పడడం చూపాలి
ఇంకొంచెం చరిత్ర వెనక్కెళ్ళి
రైల్లోంచి నెట్టబడ్డ మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీని
జాతి దురహంకార దక్షిణాఫ్రికా చూపాలి!
గాయానికి ఉపశమనం....
విచారం వెలిబుచ్చి ఎక్స్‌గ్రేషియా ప్రకటించడం కాదు
ఇంట్లో ఒకరికి ఉద్యోగం ఎకరం నేల యివ్వడం కాదు

క్షుద్రాడికి సెకండరీ స్థాయి దాకా ఉచిత విద్యాబోధనకాదు
క్షతయోనిని సంక్షేమ కేంద్రంలో చేర్చి కుట్టు నేర్పడం కాదు!
ప్రపంచాన్ని కొనుక్కుంటూ, అమ్ముకుంటూ, ఆడుకుంటూన్న
ఆటల మధ్య మనం గాయాల్ని మోస్తున్నాం కదూ
నువ్వు గాయపడందే వాడు లాభపడడు
గాయం మాన్పడమంటే మరోగాయం కాకుండా చూడ్డమే!
గాయాల్ని ఎదుర్కోవడమంటే మన శరీరాల్ని
మనం అటకమీద నుంచి దింపుకోవడమే
దింపుడు కళ్ళం ఆశ వేళ్ళతో సహా నరుక్కోవడమే!

# కుండీలో మహావృక్షం

కాలాన్ని క్రీస్తుశకంతో కొలుస్తున్నాను
రక్తసంబంధం నా వూరి రత్నగర్భంలో కలిసిపోగా
గడిపిన బాల్యాన్ని కడసారిగా చూసుకుందామని
యాభైయ్యేళ్ళ ప్రవాసానంతరం యీ పయనం-
పారే నీరు పది కడవలకు మించకపోయినా
ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికి
అద్దం పడుతూ ఊరి గడపలో అతిపెద్ద వారధి
ఊర్నుండి వేరుబడ్డ పోలేరమ్మ వేరుగా గుడికట్టుకుంది!
వాకబు చేసిన చిరునామాల మధ్య
చిరునామా లేనివాడినై తిరిగాను
ఊళ్ళో గుర్తించిన వాడు ఒక్కడూ లేడు
ఫలితకేశాలు, పండిన శరీరం
వొణికే మాట, కుదురుపడని నడక నాది
రన్‌వేలను మరపించే రాస్తాలపై వేషభాషలు మారిన జనం-
నడక ఒక కళ, నవ్వడం ఒక కళ
నిల్చోవడం ఒక కళ, పలకరించడం ఒక కళ!
స్నోసెమ్‌లు, డిస్టెంపర్లు, ఎనామిల్ దుస్తులు ధరించి
ఆకాశానికంటిన అధునాతన భవనాలు
ఇళ్ళపై ఏడు నిలువుల బావులు
ఇంటింటా అమెరికా తయారీలు!
ఇళ్ళ మధ్య నెలకొన్న వైరం
ఇండియా అమెరికా అంతదూరం-
ఇళ్ళన్నీ శీతలమయమై
హిమాలయాల్ని మరపిస్తూ

ప్రజాస్వామ్యంలో పదవుల్ని కొని పాలిస్తున్నాయి!
ఊరి శివార్లలో నా నడక....
నన్ను చూసి శివుడి నడక ఒక్కసారి ఆగాయి
ఎడారిలో ఒయాసిస్సు చూసినంత ఉత్సాహం
ఉప్పొంగిన ఆనందంలో యిద్దరం మునిగి ముద్దయ్యాం
పండి వేలాడుతున్న శివుడు నా చిన్ననాటి స్నేహితుడు
పిప్పరమెంటు చాక్కామడతన కొరికి పంచేవాడు
పంతులు నోట్లోంచి ప్రశ్నరాకముందే
క్లాసంతా జవాబు పరిచేవాడు!
ఊరంతా పెరిగి వటవృక్షమైంది
మేము కుండీలో మహావృక్షాలం
ఆకలి మేము కట్టుకున్న బట్ట
మా గుడిసెలకు తడిక కప్పడం
ఇంకా అమలుకాని ప్రభుత్వ ప్రణాళిక అన్నాడు!
ఆకాశానికి గుడిసెలు గట్టి పునాది అన్నాను!

# తరతరాలుగా

సశేషాలు విశేషాల్లోకి
విశేషాలు సమాప్తాల్లోకి
సమాప్తాలు సశేషాల్లోకి పరిభ్రమించే
సగటు బతుకుల్ని పరివేష్టించిన
అష్టదిక్పాలకుల అష్టైశ్వర్యాలు
అష్టభోగాలు, అష్టగంధాలు!
ఇది నా మాతృభూమి
అష్ట దిక్పాలకుల ఆక్రమిత భూమి
ఒక రక్తం అందరికంటే పవిత్రమైంది
నేను అమ్మబడతాను
ఒక మాట అన్నిటికంటే విలువైంది
నేను శిక్షింపబడతాను
ఒక నడక వాయువుకంటే వేగమైంది
నేను బంధింపబడతాను
మా కళ్ళకు రెప్పలుండవు
చేతులకు వేళ్ళుండవు, కాళ్ళకు పాదాలుండవు
చేతికి నోటికి మధ్య
ఒక సముద్రం, ఒక ఎడారి, ఒక శూన్యం
మాటకు మనసుకు మధ్య
ఒక లాఠీ, ఒక తుపాకీ, ఒక గాయం
ఖననమైన మా ఉనికి ఉల్లిపొర, జీర్ణతృణం!
ఎవరో ఆయుస్సును ప్రసాదిస్తున్న బ్రహ్మదేవుళ్ళు?
ఎవరో ఆయుస్సును తెంచుతున్న యముళ్ళు??
ఎవరికి వాళ్ళు వర్గాలై చీలిపోతున్నారు
ఎవరి శవాల్ని వాళ్ళు పోగేసుకుంటున్నారు

చిరునామాల్లేని ఈ శవాలెవరివి
ప్రాణ భయంతో దాగిన ఈ కాందిశీకులెవరు
దారి తప్పి పరుగెత్తే ఈ ఎస్కిమోలెవ్వరు?
గాలి నీదనుకో, నిప్పు నీదనుకో
శ్రమ నీదనుకో, ఫలితం నీదనుకో
తెగింపు నీదనుకో, జ్వలనం నీదనుకో
అప్పుడే అష్టదిక్పాలకుల పలాయనం కోరస్ పాట
తిరిగి చూడని లేడి పరుగు-
ఇది నా మాతృభూమి
అందరి జన్మభూమి
గాయపడ్డ చేతులు నడుస్తూ
రోడ్లు వెల్లువైనట్లుంది
అలిసిపోయిన ఆదిశేషువు
భూగోళాన్ని నా భుజంపై మోపినట్లుంది
విషాన్ని విషంగానే ఇచ్చెయ్యండి సోక్రటీసులకు
పాలల్లో రంగరించి రుచులు మార్చడం ఎందుకు?

# నవజీవన నిర్మాణానికై

పనీ పాటూ లేని సూర్యుడు పగలు
ఏడు గుర్రాల్ని రథానికి కట్టి మేపుతుంటాడు
ఇంటిపోరు పడలేని చంద్రుడు
ఆరుబైట అందరిముందు పడకేస్తాడు
ఉక్కకు తట్టుకోలేని గాలి వూరకే
నేలపై ఉరుకులు పరుగులు తీస్తుంది
కొండకోనల్లో నిద్రరాని నీరు ఉబుసుపోక
రాయిరప్పల్ని దాటి జనం మధ్య షికారు చేస్తుంది
అంతేనా! ముమ్మాటికీ అంతే!
బతుకు నింపాదిగా జీవించడానికి కాదు
అరక్షణంలో ఆత్రంగా జుర్రుకునేందుకు-
ఆరుగజాల గుడ్డను మూరెడు చేసి
మొలకు చుట్టి ఫేషను పేరెడు చేద్దాం
కళ్ళకు కేమిల్ రంగుల్ని వేలాడగట్టి
కలలు కంటూ బలాదూరుగా ఊరేగుదాం
కాళ్ళు ఆక్సిలరేటర్లు తొక్కడానికే
చేతులు ధనరాసులు పోగెయ్యడానికే
ఒకడింట అమృతభాండం నింపడానికి
ఇంటింటి భాండాల్ని పగలేద్దాం
అంతేనా! ముమ్మాటికీ అంతే!
కాదు! ఎంతమాత్రమూ కాదు!
భూమిపై చెట్లవేళ్ళు
భూమి పొరల్లో చెట్ల తలలు
పథకం శీర్షాసనం

ప్రభుత్వం ఉష్ట్రపక్షి
రూపం నిర్మూలన కాందే
నిర్మాణం జరగదు
ఎన్ని పూలు రూపుమారితే చిటికెడు సిందూరం
ఎంత చెక్క అరగదీస్తే చారెడు గంధం
ఒక అభేద్యకుడ్యవిధ్వంసం
నిరాశ్రయులకు ఆశ్రయం
పారా, పలుగూ
కత్తీ, సుత్తీ
కర్రూ, కొలిమీ
నిర్మాణాత్మక నవోదయానికే
సమస్త జన కళ్యాణానికే-
అంతేనా! ముమ్మాటికీ అంతే!

# ఒక ఆవిష్కరణ కోసం

సుమతి శతకం, వేమన పద్యాలు
కూడికలు, గుణింతాలు
ఆశువుగా అలవోకగా వొప్పజెప్పబడతాయి
వొప్పజెప్పడమంత సులభం కాదు బతుకు
నడక, పరుగు, దూకుళ్ళతోబాటు
నిశ్చలంగా ఒక్కోసారి నిలబడిపోయేది బతుకు!
ఒక గాలి గాయాన్ని
మనఃక్లేశాన్ని మోసుకొస్తుంది
ఒక గాలి శీతల మలయమారుతమౌతుంది
ఒక నిప్పు మారణమై
మసి చేస్తుంది
ఒక నిప్పు రాజుకుని రాజుకుని
వంటింటి మంటౌతుంది
ఒక నీరు మహోగ్ర ఉత్పాతమై
మిత్తి కౌగలౌతుంది
ఒక నీరు దాహార్తుడి సంజీవనౌషధౌతుంది!
పొర నుండి పొరకు జారుతూ
పాతాళగంగ తప్పినవాడికి పట్టుబడదు
ఎండమావులు ఎదురొచ్చి
వెక్కిరించే తేట నీటి జలాశయాలు
వాడిపోయే చెట్టుముందు
వాకిట నోరెండి నిల్చున్నవాడి చేతిలో
నిండు వెంబుడు నీళ్ళు
ఎండిన ప్రాణాల మధ్య నిండు పరీక్ష!

పంజరాలు కనిపించవు
పక్షులు మాట్లాడుతుంటాయి
అడ్డుగోడలుండవు
ముఖాముఖాలు కనిపించవు
కాలికింద పడ్డది రాయనుకునేలోగా పేలి
అష్టదిక్కులకు శరీర శకలాల్ని
పంచడం యాదృచ్ఛికం కాదు!
వెండి మబ్బులపై కపోతాల నెత్తుటి మడుగులు
నిద్రకు నోచని నిర్భాగ్యుల మధ్య
నిద్రాణుల నిత్య జాగరణ
రహదారి ఒకడి సుఖమయ మార్గం
ఒకడి విషసర్పాల అగడ్త
నిశ్శబ్దంలో రాలిపడ్డ ఆకు
శబ్దించి ఉనికి చాటుతుంది
ఆనవాలు నాటి వర్తమానం స్పృశించాల్సి వుంది
నిప్పుకు నిజరూపం నివురు తొలిగాకే...

# సశేషాల సాక్షిగా

మేఘాలు సూర్యుడికి తులసి తీర్థం పోస్తున్న సమయం
రోడ్డుపై వార్త భళ్ళున పగిలి
నగరం నరాల్లోకి సైలెన్‌లా వ్యాపిస్తుంది!
రోడ్లు, గల్లీలు ఇళ్ళల్లోకి పరుగెడతాయి
దార్లు తలనీలాలు యిచ్చిన తలలౌతాయి
ఉప్పొంగిన సైన్యం నగరాన్ని ముంచెత్తుతుంది!
జీపులు, వ్యాన్లు, అరుపులు, ఆజ్ఞల మధ్య
పల్లెటూరి అపరిచిత ఆగంతకుడి
గమ్యానికి దారి కరువౌతుంది!
చీకటి భయపెడుతుంది
గాలి భయపెడుతుంది
కాంతి భయపెడుతుంది
తన ఉనికే తనను భయపెడుతుంది
నక్కుతూ నడుస్తాడు
తాబేలై పాకుతాడు
పరుగులాంటి నడక నడుస్తాడు
రౌతెక్కిన గుర్రంలా పరుగెడతాడు
దారి తెలియని గమ్యం
ఎంత నడిచినా అగమ్యం!
అంతలో అనుమానాస్పద సంచారుడౌతాడు
క్షణంలో సంఘవిద్రోహి ఔతాడు
నగర రక్షణ విఘాతి ఔతాడు
కనిపిస్తే కాల్చివేత ఆజ్ఞకు బలై
అసువులు బాసిన మొదటివాడౌతాడు

అత్యంత భద్రతా వలయం మధ్య
అతడు సోదా చెయ్యబడతాడు!
చేతి సంచిలో చినుగుపట్టిన చీర జాకెట్టు
నీటుగా చుట్టిన రెండు నాటు పొగాకు చుట్టలు
వయసు పండిన రెండు డజన్ల అరటి పండ్లు
సర్కారు దవాఖానా చిరునామా కాగితం దొరుకుతాయి!
కనిపిస్తే కాల్పుల పట్టీని
అధికార అనధికార లెక్కలు విభేదిస్తాయి
కళింగ యుద్ధపు రక్తపు టేర్లు
పొడవు, వెడల్పు, లోతు కొలిచిన అశోకులు
మొక్కలు నాటి చలివేంద్రాలు నిర్మిస్తారు
గౌతములు బుద్ధులై అహింసను పరుస్తారు
రోడ్లూ, గల్లీలు నారు పెరిగిన పొలాలౌతాయి!

# విత్తనమై మొలకెత్తుతా

ఆకాశంలో షికార్లు
ఎవరెస్టుపై జెండా ప్రతిష్ఠాపన
వాడి కనిష్ఠ విజయాలు!
చంద్రుడిపై కాలూని
శుక్రమండల ఆవిష్కరణ
వాడి విశిష్ట విజయ దుందుభులు!
వసుధైక కుటుంబం
చూపుడు వేలుతో శాసించబడింది
ఆరోహణతో పాటు అవరోహణను సమంచేస్తూ
అధఃపాతాళానికి పయనం
వాడి గరిష్ఠ భ్రంశనం!
ఒక్క వేటుతో
ఒక్క ఎత్తుతో
ఒక్క వేటుతో
ఒక్క క్షణమే ఎదిగిపోవాలనే ఎత్తుగడ!
ఏనుగెక్కి మావటి విసిరిన నాణెం ఎత్తుకు
ధనరాసి సేకరణే ధ్యేయం
కల్తీలు ఉప్పెనై పారి
రూపాయి వేయిరూపాయలుగా మంత్రింపు!
శుష్కించిన కండరాలకు
మరణ మృదంగమై
మంచంపట్టిన శరీరాన్ని
శ్మశానానికి సాగనంపే కల్తీమందులు
పచ్చ విప్లవం బీడు నేలకు అంకితమిస్తూ

పంట విత్తనాల కల్తీ
కళ్ళు తెరవని పుణ్యభూమిలో
కల్తీ రారాజుల సామ్రాజ్యం!
నేరం శిక్షార్హమే
నేరస్థుడు శిక్షార్హుడు కాదు
తప్పుకోడానికి ఎన్నెన్ని పక్కదారులో
తప్పించడానికి ఎన్నెన్ని అడ్డదారులో-
ఆహారంలో కల్తీ చెయ్యండి
తిని హాయిగా మరణిస్తాను
విత్తనాల్లో కల్తీ చెయ్యకండి
మొక్కనై నేను మొలకెత్తాలి!

# ముద్దుబిడ్డ పాదం ముద్దాడుతున్నా

ఊరవతల సెలయేరు స్వాగతిస్తుంది
ఊర బావి అతడ్ని వెలేశాక!
మయూరి నాట్యాన్ని గేలి చేసి
మంజీర నాదాన్ని మరపించి
ఎగసిపడే సెలయేరు
అతడ్ని ఆలింగనం చేస్తుంది
ఒళ్ళంతా తుళ్ళింతతో
అభ్యంగన స్నానం చేయిస్తుంది!
గాలిసోకి మైలపడే మనుషులకు
అతడు దూరంగా పారిపోతే-
కొండగాలి అతడి క్షుబ్ధ హృదయాన్ని చుట్టి
తడిమి తడిమి ముద్దాడి
గుండె వూసులాడుతుంది
మేఘాల అందలం ఎక్కించి
గాలి బోయీల చేత సాగనంపుతుంది!
కాలి చెప్పులు చేతబట్టి
ఊరి మధ్య బితుకు బితుగ్గా నడిస్తే
వేదనా భరిత విషణ్ణ వదనంతో
నేల అంటుంది.....
అందరినీ కన్నాను
కొందరికే అమ్మను
అందుకే ముద్దబిడ్డ పాదం ముద్దాడుతున్నాను-
మనిషిపై సాటి మనిషి
అస్పృశ్యత ఉక్కుపాదం మోపి

ఉగ్రుడై సముద్రుడు
ఒక్క వుదుట్న ఒడ్డుకు అలై దూసుకొచ్చి
అంతలో మెరుపులా మాయమైన
మాయాజాలం వెనక మూల విరాట్టు మనువు!
ఒక్క సముద్రుడు శక్తి హీనుడు
సప్త సముద్రులు ఒక్కరై ఉప్పొంగి
వర్ణవ్యవస్థను మట్టుబెట్టాల్సి వుంది!

# నిప్పుకు తుప్పుపట్టిన వేళ

అక్షరాలు విలాసంగా నడిచినపుడు
శృంగారం
అక్షరాలు సిందూరం పూసినపుడు
బందూకం
గాలి మాట్లాడుతుంది తుఫానై
నీరు మాట్లాడుతుంది ఉప్పెనై
రేణువు మాట్లాడుతుంది ఇసుకమేటై
మనిషి మాట్లాడ్డంలేదు
కలాలు కదలడంలేదు!
వాలిన చూపుపై
వంచిన తలపై
ఎన్నెన్ని శరాఘాతాలో
హింస పట్టాభిషిక్తం అయ్యాక
అహింస అసమర్థుడి ప్రబోధం
అంటరానితనం పంటలకూ వుంది
స్పృశ్యాస్పృశ్యాల మధ్య పంటకాలవ
అస్పృశ్యుడి పొలం వైపు పారనంటుంది
సమాజపు మునులేత చిగుళ్ళపై
విషసర్పాల కాట్లు
పగలు సమతావాదం తొడుగులు
రాత్రి సంస్కరణవాదం ముసుగులు
ఎండవేడిమికి వొళ్ళంతా మాడ్చుకుంటూ
చెట్లు పరిచిన నీడన మనిషి మౌన స్వరూపం
మనిషికి రెక్కలు మొలిచాక

ఎగరాల్సిన ప్రాంతాన్ని ఎంచుకోని గుర్తులు!
నడుస్తున్న అంధభిక్షువు చేతిలోని
లాంతరు వెలుగుచూసి
అంతర్జాతీయ సెమినార్లు అవసరంలేదు
పశ్చిమాద్రిలో సూర్యుడు చుట్టూ చేరి
రోజా వీడ్కోలు యిచ్చేది గాయపడ్డ చూపులే!
ఎప్పుడూ
అక్షరం విజేత
మాట విజేత
కలం విజేత
గళం విజేత!

# పద్దెనిమిది పర్వాల బతుకు

రెక్కలొచ్చిన పిల్లలు ఎగిరిపొయ్యారు
అమ్మను త్రిశంకు స్వర్గాన అభిషేకించి-
అమ్మను నేను - అంతకుమించి ఆడదాన్ని నేను
నేను నేనుగా నిలబడనివ్వని పురుషుని రంగప్రవేశం
రంగులు పూసి, అలవిగానివేళ అపవాదులు చల్లి
రంగుమార్చిందని, రంకు నేర్చిందని దూషణ!
సంకెళ్ళ నడకనాది
మాట పెగలని గొంతునాది-
కత్తిమీద సాముకు నన్నొదిలి
పోటీ ఆటకు పురుషుడే తీర్పరి
నా ఓటమి నాకు అపహాస్య భూషణం
నా విజయం మగాడికి నవరత్నమకుటం
నీరు, నిప్పు, హింస, అహింస, నింగి, నేల
అన్నీ జయించిన వాడికి అమ్మను నేను
అర్ధాంగిని నేను-
పగలు భూమ్యాకర్షణ పరిధి దాటి పరిభ్రమించి
రాత్రి భూమ్మీద పడుతున్న
ఒకడి కాంక్షను నేను-
అరచేతిని అద్దంలో చూసుకుంటున్న దర్పం ముందు
దోసిట్లో నీళ్ళు పట్టి పరుగెత్తి పరుగెత్తి
తూట్లుపడ్డ నా మనసు కకావికలం!
నా గుండెలు నాకై పిండుకున్నా, నా కాళ్ళు నాకై నరుక్కున్నా
నా చేతులు నాకై సంకెళ్ళు వేసుకున్నా నాకు వొకింత తృప్తి!
నేను నేనుగా మారాల్సి వుంది, అభినయం మానాల్సి వుంది

ఎలుగెత్తాల్సి వుంది, అంకం ముగించాల్సి వుంది
నేనిపుడు నెత్తుటి వేలిముద్ర వేస్తున్నాను
తెల్లబోయిన ముఖాలపై ఆత్మస్థైర్యం అద్దుతున్నాను!
రేపుదయం ఉదయిస్తాననే నమ్మకాన్ని
ఈరోజు మరణం ఆహ్వానిస్తుంది
చావు పుట్టుకల మధ్య
పద్దెనిమిది పర్వాల బతుకు స్త్రీది
అమ్మ భాషనూ, ఆడదాని బాధనూ
ఆవిష్కరించే కవిత్రయం ఏది?

# నిండు జవాబు

చేతులు చప్పట్లకు అరువెళ్ళాయి
భుజాలు పల్లకీ మోతకు అద్దెకెళ్లాయి
చేతికి నోటికీ మధ్య ఎన్నో సార్వత్రిక ఎన్నికలు
ఎన్నెన్నో పంచవర్ష ప్రణాళికలు
అబద్ధానికి అబద్ధానికి మధ్య వేయి నిజాలు
వేయి నిజాల్ని దాటేస్తున్న ఒక్క అబద్ధం!
ఒక చెంప కొట్టాక మరో చెంప మార్చగా మార్చగా
మారిన చెంపల రూపులు
రూప రహిత నిర్వేదపు బతుకులు
ఒక మనిషి ప్రాణరక్షణకు
పరదేశాల మందులు మోస్తూ విమానాలు
ఒక మనిషి ప్రాణరక్షణకు
యాచన చేస్తూ శుష్కించిన చేతులు!
సగటు మనిషి ఛిద్రం వెనక
రంగుటద్దాల నేపథ్యం భద్రం
ఇప్పుడు తల్లి నెల తప్పడం
జనన మరణాల జాబితాలో మరణం లెక్క!
చీకటికి చైనా గోడంత పటిష్ఠత ఉంది
మెదడుంది, ఆలోచన వుంది
అరేబియా సముద్రమంత ఆకలి వుంది
చీకటి కంటే వెలుగు వేయిపాళ్ళు ఎక్కువ
వెలుగెప్పుడూ వేయిపాళ్ళు వెనకే పడివుంది
గోరంత దీపం కొండంత వెలుగు
వెలుగు చీకట్ల నిష్పత్తికో ఉదాహరణ!

అన్ని శ్రమల్ని తట్టుకుంటున్న భూచర్మానికి
కష్టజీవి చర్మం సమ ఉజ్జీ
నిశ్శబ్దం ఒక ఆలోచన
ఒక అంతర్మథనం
శబ్దం ఒక ఆవేదన
ఒక చైతన్య గీతాలాపన!
కలం పాతదే కొత్తమార్గం రాస్తుంది
అల పాతదే కొత్తరాగం తీస్తుంది
చెట్టు పాతదే కొత్త చిగురు వేస్తుంది
అప్పుడు తల్లి నెలతప్పడం
జనన మరణాల జాబితాలో జననం లెక్క!

# ఓటు వజ్రాయుధం

ఎందుకయ్యా వాగ్దానాల వెల్లువ
అడుగడుగునా గోదావరికి ఆనకట్టలు కడతావు
కృష్ణాజలాలు మా లోగిళ్ళకు పారిస్తావు
బియ్యం రాసులు మాగాదెల్లో నింపుతావు
పచ్చని తివాసీలు పరిచి
సుతిమెత్తని నడకలు నడిపిస్తావు!
దున్నేవానిదే భూమి
మేడి చూడనివాడు రికార్డుల్లో దున్నుతుంటాడు
భూపరిమితి చట్టం భూమిని పంచుతుంది
పంచిన భూములు
పరిధి దాటినవాడి పంచకే చేరుతాయి!
స్వాతంత్ర్యం వచ్చిన యిన్నేళ్ళూ
మైళ్ళతరబడి మంచినీటికై నడూస్తూనే వున్నాం
సంవత్సరానికో ఫర్లాంగు దూరం తగ్గినా
మైళ్ళ నడక తప్పి
మంచినీరు మా దగ్గరకు వచ్చేది!
ఎన్నికలు మీకు పరిశ్రమలు
పెట్టుబడులు వెచ్చించి లాభాలు గడిస్తారు
కూలీలమై ఓటర్లమై మేము
ద్విపాత్రాభినయం చేస్తుంటాం!
మీ ఖద్దరు దుస్తులపై నెత్తుటి మరకలు
సరికొత్త సూపర్ డిటర్జంట్ సబ్బుతో కదుక్కొని
గాయాల మచ్చల మా శరీరాల ముందు
మల్లెకన్నా తెల్లని నవ్వు చల్లుతారు!

ఇన్నేళ్ళూ ఒంటిమీద వలువల్ని
ఒక్కొక్క ఎన్నిక వొలుచుకుపోయింది
గోచికి మించిన దరిద్రం లేదు
గోచి వూడిపోతుందని భయమూ లేదు!
ఇంతకాలం నేను
శిరస్సొంచి ఓటు పట్టి నీ వెంట నడిచాను
నేడు నువ్వు
శిరస్సెత్తి ఓటుపట్టిన నా వెంట నడుస్తున్నావు
ఓటు ఒక వజ్రాయుధం!

# అశ్రువు కంటి సృష్టికాదు

అశ్రువు కేవలం కంటి సృష్టికాదు
మనసును వడగట్టగా వచ్చే
బాధారూప సంకేతమది!
ఎక్కాల్సిన వాడు పచ్చాలైటు అయినప్పుడు
ఎక్కాల్సిన రైలు జీవితకాలం లేటు కాదు!
జరిగినవన్నీ చీకట్లో జరిగాయనడం సరికాదు
సూర్యుడు, దీపాలు చూసినవెన్ని?
న్యాయమూర్తులు, పోలీసులు
సూర్యుడి కుటుంబీకులు!
అత్యాధునికయుగంలో నిలబడి
రాతియుగానికి జారుకుందామా
ఎందుకు రాతియుగం గొడ్డళ్ళు?
సాక్ష్యాల మాఫీకి కంప్యూటర్ తెలివి!
చీకటి గోడలు చీకట్లోనే కూల్చితే
అన్యాయం చూడమని
చీకటి వెలుగును తెచ్చి తీర్పుకోరుతుంది!
వెలుగు పసితనం, వృద్ధాప్యం-
నీడకు ఎంత లోకువ?
పొద్దుగ్గా ఇంకా పొద్దుగ్గా
మనిషిని చూపి గేలిచేస్తుంది
మధ్యందిన కాంతిలో
కాళ్ళమీద పడి వేడుతుంది
నీళ్ళు మరిగాకే ఆవిరి!
సైంధవుడ్ని చంపడానికి

క్షణంలో వ్యూహరచన తప్పదు
ఉరి తియ్యబడేవాడి ఆఖరి కోర్కె ఏమిటి
అదీ నీ ప్రాణం తప్ప అన్నాక.....
కౌరవుల్ని శాసించలేని మహారాజా ధృతరాష్ట్రుడు?
మాట రుచి ఎలా మోసగిస్తుందో
స్వార్థం ఎలా బలిగోరుతుందో.....
అప్పుడు యిప్పుడు ఎప్పుడూ పద్మవ్యూహాలే
అభిమన్యులు కీర్తి శేషులౌతారని!
బావి తవ్వుతూ తొలగిన బండ కింద
ఎగసిన జెల మనకు స్ఫూర్తి!

# ప్రశ్నకు బదులేది

పిడుగై భూమిని చీల్చుకు పోయేది ప్రశ్న
జ్వాలై పైపైకి ఎగజిమ్ముకొచ్చేది ప్రశ్న
మాటతోపాటు మౌనమూ ప్రశ్నే
చేతతో పాటు చూపూ ప్రశ్నే
ప్రశ్నించడం ప్రతిఒక్కడి హక్కు!
స్త్రీ, పురుషుల
పండిత, పామరుల
పీడిత, పీడకుల ప్రశ్నలు వేరు
ప్రశ్నించే తీరులు వేరు వేరు!
ఇన్నిన్ని ప్రశ్నల భాండాగారం మధ్య
ఎన్నెన్ని వెలుగు పండ్లను కోసి
వాకిట వేలాడదీశాం?
ఎన్నెన్ని నక్షత్ర పుష్పాల్ని తుంచి
తల్లో తురుముకున్నాం?
ఎన్నెన్ని ఆమని కోకిళ్ళ
గొంతుతో గొంతు కలుపుకున్నాం?
నిశ్శబ్దంలో మునిగిన నాలుకను
గాలి గేలి చేస్తుంది
ప్రత్యక్ష ప్రతిమను చూడని నయనాల్ని
రెటీనా నిందిస్తుంది
పుష్కరాలు, శతాబ్దాలు, యుగాలుగా
పోగుపడ్డ ప్రశ్నల చక్రభ్రమణం
ద్రౌపది పరాభవం, సీతాపరిత్యాగం
శకుంతల పరిణయం, కర్ణుని మరణం

వెన్నంటిన ప్రశ్నలు!
పరిధిని మించి విస్తరణ కోసం
చేతిలోది కలమో ఖడ్గమో
తెగెయ్యాల్సిన చోట తెగిపడాల్సి వుంది
తరతరాల బారులు తీరిన ప్రశ్నలకు
తక్షణ సమాధానం కావాల్సి వుంది!

# ఒయాసిస్సులేని ఎడారి

సముద్రఘోషకు భాష వుంది
జాలరి సరైన దుబాసి
కన్నీటికి అంతర్భావముంది
పేదవాడు సమగ్ర అనువాదకుడు!
అక్షరం అక్షరంలా వుండదు
రంగేసుకుంటుంది
ముసుగేసుకుంటుంది
నగిషీలు తొడిగి అమ్ముడైపోతుంది
చేతిలోని దీపాన్ని నిర్దయగా లాక్కుంటూ
దీపం చమురు నిర్లజ్జగా వంపుకుంటూ
నిత్యం ధూపదీప నైవేద్యాలు-
వెలిగే దీపాన్ని చేబట్టి ఎవ్వడూ ఎదురురాడు!
ఒకడ్ని వెంటేసుకుని
ఒకడ్ని వెంటాడుతుంది రాజ్యాంగం
అందరి శ్రమసౌందర్యాన్ని
కొందరికి పంచడమే ప్రణాళిక!
చిరునవ్వు కొనుక్కుంటే రాదు
చిగురులా పుట్టుకు రావాలి
శాసిస్తే చేతులు నమస్కరించవు
విశ్వసిస్తే నమ్రత ఉద్భవం-
గంగ గోదావరుల మధ్య
బతుకు ఒయాసిస్సు లేని ఎడారి
ఒకే బాధకు ఎన్నెన్ని దారులో
అన్ని బాధలు ఒకటైన దారిలేదు

కనురెప్పలు కన్నీరు కారుస్తున్నాయి
కర్తవ్యం, ప్రబోధం మరచి-
నిమ్మదబ్బలా పుట్టిన బాలచంద్రుడ్ని
నిండు చంద్రునిగా మార్చిన నేపథ్యం వెనుక
భూమి సూర్యుల
పక్షం రోజుల కృషి ఫలితం పరోక్షంగా వుంది!
కర్తవ్య నిర్వహణలో కాలాన్ని కూడబెడుతున్నాను
అప్రమత్తతా మజిలీలో అడుగిడి వున్నాను
భుజం మార్చుకోనీ-
భగీరథుడ్ని బంధించి నడిపించాల్సివుంది!

# తులాభారం

నీ రెండు జడలు
ఒక మయూరమై ఆడలేదు
చీర కుచ్చిళ్ళు
పరికిణీ రూపం దాటలేదు
ఆదమరిచిన నిద్ర
అమ్మ ఒడిలో దాగటం మానలేదు
నీ పెదాలపై
పాలమరకలు మాయలేదు
వరుని ఇంట కట్నం నింపి
ఒకింటి దానవయ్యావు
వంటింటి కుందేలై
ఇంటిల్లిపాదికి ఆహారంగా మారావు!
లక్షకు ఎన్నివేలు
వేయికి ఎన్నివందలు
కోటికి ఎన్నిలక్షలు?
తులాభారానికి కాలం అంకితమైతే
కరెన్సీ లెక్కించడానికి కాలవ్యవధి ఎక్కడ?
రూపాయికి వంద పైసలు
వంద స్త్రీలు ఒక రూపాయికి తులాభారం
ఒక పురుషుడు ఒక రూపాయికి సరి సమానం!
నీ పసిడి పాదాలపై పారాణి ఆరనేలేదు
రెండు సంధ్యల మధ్య వెలుగు ప్రసవించనేలేదు
నీ కళ్ళకు శ్రావణమేఘం కమ్ముకుంది
మనిషికి ఎన్ని మరణాలు?

రూపాయికి ఎన్ని జననాలు?
పదహారును నూరు చేసిన
ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞుల మధ్య
నూరేళ్ళ పంట పదహారేళ్ళకే
పండించిన కృషీవలుల మధ్య
కట్టినవాడే కూల్చేశాడా పొదరిల్లు?
కూర్చినవాడే చెరిపేశాడా బొమ్మల కొలువు?

# వేయి జననాల జవాబు

ఉత్తుంగ తరంగమై ఎగసి ప్రశ్నిస్తాను
అంబర మంబిత హిమాలయాన్నవుతాను
ముప్పూటల్లో ఒక్క పూటకు తిండిలేని నా ముందు
ముప్పై తరాల సంపద పోగుచేసిన వాడ్ని
అభేద్యకుడ్యమై ప్రతిఘటిస్తాను
ఆకలి, దాహం అనడం నేరమైతే
నూరుశాతం నేను విద్రోహినే!
ఊరికి ఊరికి మధ్య ఉక్కు తెర
ఊరు కదలకుండా పహరా
కదిలి వెళ్ళిన ఊరు మళ్ళీ కదిలి రాకుండా పహరా
గంజికి, గిన్నెకు పహరా
ఇంటికి, మారుకు పహరా
అందరిదీ ప్రాణభీతి, అస్వతంత్రత, అభద్రత
నిషేధాజ్ఞల్ని, కల్లోలిత చట్టాల్ని
నిర్బంధాల్ని, అణచివేతల్ని నిలేసి ప్రశ్నిస్తాను!
పహరా మారిపోయింది
సరిహద్దు భద్రతా దళాలు, శీఘ్రకార్యాచరణ దళాలు
ఆశ్వీక దళాలు, సైనిక పటాలాలు
మారిన పహరాలో నా ఎత్తుగడ
మళ్ళీ మళ్ళీ మారుతుంది
పహరా వున్నంతవరకు ప్రతిఘటన సాగుతుంది!
గ్రామాల్లో తుపాకులు మొలిచి తూటాలు పండి
గ్రామస్థుల కడుపులు నింపుతున్నాయి
కల్లోలిత ప్రాంతాల్లో కన్నతల్లులు, కన్నెపిల్లలు

పంజావిప్పిన పులిముందు లేళ్ళు-
మాన, ప్రాణ రక్షణ పోరాటంలో
ప్రాణార్పణ చేస్తున్న ధీరవనితలు!
గ్రామ సరిహద్దులే దేశ సరిహద్దులై
అత్యంత పటిష్ఠంగా పహరా-
ఉద్యమం వెంట సమూహం వుంది
మరణించిన వీరుల స్థానం మరికొందరు పూరిస్తారు
ఒక అణచివేతకు వేల విస్ఫోటాలు సమాధానం
ఒక నరికివేతకు వేయి జననాలు జవాబు!

# కొన్ని గుండెలు భూగోళమంత

నీ రంగు మార్పిడి బహిరంగం
నీ టోపీ మార్పిడి ప్రత్యక్షం
నువ్వు హత్య జేస్తే హతుడ్ని నేను
నువ్వు దోపిడీ చేస్తే పీడితుడ్ని నేను!
పెట్టుబడి వ్యవస్థ
పొద్దు తిరుగుడు పువ్వు
ముఖం ఆదాయానికి ముడివేస్తుంది
పలుదారులు మీవి
పలుగమ్యాలు మీవి
మౌన యూనిఫారం తొడుక్కుని
చౌరాస్తాలో సిగ్నల్సు యిస్తున్నాను!
భూమ్మీద పడగానే
ఒక్కొక్కడికి ఓ చీకటి రాత్రి పంపకం
చమురులేని దీపం
క్షణకాలం వెలుగుతుంది
గోరంత దీపం
కొండంత వెలుగు చూపేలోగా
కొండంత చీకటి
గోరంత దీపంపై కూలుతుంది!
నూతన సంవత్సరాలు
నవ్య ఉగాదులు
వయస్సును పెంచడానికే
వసంతాలు పంచడానికి కాదు!
మట్టి నేను, నీరు నేను

ఊడల మఱ్ఱిలా పెరిగిన చెట్టు నీవు
నీ దోపిడీ పెరిగింది
నీ భద్రత పెరిగింది
నా చైతన్యం నీ చింత.....
చింతను పెంచే స్థాయికి పెరిగిన చైతన్యం-
అలకగానే పండగ కాదని తెలిసీ
ఇల్లు అలికాను
అలకడం పండగకు పూర్వార్థం
ఓడిన సాలీడు మళ్ళీ మళ్ళీ అభ్యాసం నా ఆదర్శం-
ఎవరి గుండె వాళ్ళ పిడికిలంత కాదు
కొన్ని గుండెలు భూగోళమంత!

# నన్ను నేను ఆవిష్కరిస్తున్న దృశ్యం

కాళ్ళకు రోడ్లు తగిలించుకుని
భూమ్మీద అన్నిటి వేగాన్నీ మించి
ఇంటర్వ్యూతో తలపడతాను!
ఒక్కోసారి
ప్రవరుడిలా కాళ్ళకు పసరు పూసుకుని
ఆకాశం హద్దయి ఢీకొంటాను
గోడకు కొట్టిన బంతిలా
వచ్చి యింట్లో పడిపోతాను!
ప్రభుత్వం వారి ఆఫీసు ఫైళ్ళు
నాన్నగారి చూపు తినేశాక
మాడిన కనుగుడ్లకు రక్షణై
కనురెప్పలు కృతజ్ఞతగా కదుల్తుంటాయి!
లక్ష్మణుని చూపు ఎప్పుడూ
సీతమ్మ పాదాలపై అన్నట్లు
చారెడు గింజలు చాట్లో పోసి
వంచిన చూపుతో అమ్మ
రాళ్ళూ బియ్యం సఖ్యత విడదీస్తూ వుంటుంది!
చెల్లీ తమ్ముడు కథల్లోకి
ఇంకా నా కలం దిగలేదు!
ఆకలి మహా గొప్పది
ఆకలి మహా ప్రేమమయం
అన్నం వేళకు అందర్నీ
వంట గదిలో కలుపుతుంది
కడుపు నిండకుండానే చేతులు కడుక్కుని

కళ్ళల్లో చీకటి కనపడకుండా
కాసేపు చూపులు మరల్చుకుంటాం!
ఆకలి పారదర్శకం
ఆకలి జ్ఞానదర్శకం
ఐక్యంగా మమ్మల్ని అన్వేషణలో పడేస్తుంది!

# దృశ్యానికి మరోవైపు

వేగు చుక్క పొడిచింది
కుప్ప నూర్పిళ్ళ కదలికల్లేవు
కొక్కొరోకో మార్మోతల మధ్య
నిద్రలేచిన మోతుబరి ఇళ్ళల్లో
నిత్యకృత్యాలు
అత్యవసర కార్యాలు
ఒక్కటీ మేల్కొలేదు!
మునసబుగారింట సుప్రభాతానికి
గళమెత్తే సేవకుల అలికిడి
జమా బందీల హడావిడి ఆర్భాటాలు లేవు!
చుట్టిల్లు వంట గదిలో
కవ్వం కదలిక లేక
వెన్నను ప్రసవించాల్సిన పెరుగు
చాలు బరువు మోస్తూ వుంది!
చెరువుకి ఇంటికీ మధ్య
కదిలి కదిలి నలిగిపోయిన కావడి
గాయాల్ని ఆరేసి గాఢనిద్రలో వుంది!
మూలనున్న చీపురు
మౌనతపస్సు చేస్తూ వుంటే
కాన్వెంటు పిల్లల్లా తళతళలాడే అంట్లు
ఇంకా అభ్యంగన స్నానం చెయ్యలేదు!
పలుపు విప్పని జంగిలి గొడ్లు
మోరెత్తి ఎదురుచూస్తుంటే
ఎద్దు మెడల్ని ఇంకా అలంకరించని

ముచ్చల పట్టెళ్ళు
చిలక్కొయ్యకు వేలాడుతున్నాయి!
కొట్టం మలమూత్రాల రొచ్చుమయమై
కడగని కక్కసుకు ప్రతిరూపమైతే
మేరు పర్వతమై వచ్చి పడే
పచ్చి గడ్డిమోపు జాడే లేదు!
అందుకు కారణాలు అనేకం కాదు
హరిజనవాడ అగ్నికి ఆహుతి కావడం!

# నమ్మకం వమ్ముకాదు

సిద్ధార్థుడు ఇల్లు విడిచిన రాత్రి
స్వాతంత్ర్యం సిద్ధించిన రాత్రి.....
ప్రతి రాత్రికో ప్రాశస్త్యం!
ఏ పక్షికి ఏ ఆహారం యిష్టమో
వలపన్నిన వేటగాడికి ఎరుక
ఓటర్ని వలవేసే యత్నంలో
వింత వింత ఎత్తుగడలు!
రాత్రికి రాత్రి వాడు
అధినాయకుడయ్యే ప్రక్రియలో
చప్పట్ల కిరాయి ఎంత?
నరమేధపు పారితోషికమెంత?
జన సమీకరణ రేటెంత?
ప్రజలే వాడి దేవుళ్ళు
దేవుళ్ళకు వాడే దేవుడు!
నాయకుల మాఫియా గ్యాంగుల మైత్రి
క్షుద్రస్వాముల దోస్తీ
గూండాల చెలిమి
ప్రజాస్వామ్యపు తీపికొలనులో
తిమింగలాల స్థిరనివాసం!
పాలకుడు భద్రం, వాడి అంగరక్షకదళం భద్రం
ప్రజలు, పుణ్యభూమి అభద్రం
ధర్మానిది నాలుగు కాళ్ళ నడక
ఎప్పుడూ ఒక కాలు మరమ్మత్తు
అన్ని బింబాలు చంద్రబింబాలని

అద్దం నిజంగా అబద్ధం చెబుతూంది
ఒకడి కడుపు మంటతో ఒకడు
చలి కాల్చుకునే పోకడ!
తుపాకీలో తూటాలు నిండుకున్నప్పుడే
నిజమైన సైనికుడి నిగ్గుతేలుతుంది
అసలు పోరాటం ఆరంభమౌతుంది
కన్నీటి సముద్రంలో ఈదేవాడికి
కాళ్ళకింద భూమి కదిలిపోదు!
నమ్మకం వమ్ముకాదు.....
వెన్న రాబట్టడానికి పెరుగును
మరింత మథించాల్సి వుంది!

# నెలలు నిండిన బిడ్డకోసం

ఊరిపాదాలు వాడకు తగిలేలా
వాడ మీదుగా ఊళ్ళోకి
తూర్పు పడమర గాలులు వీచకుండా వుండేలా-
ఊరువాడలు నిర్దిష్ట పరిధిలో నిర్మితాలు
ఎంతైనా పాదాల్లోంచి పుట్టిన పంచములం కదా...
తాజమహలుకు రాళ్ళెత్తిన కూలీల సంతతి
నేడు జవసత్వాలుడిగి రాళ్ళెత్తలేని దుస్థితి
సర్కారుకు నా సంక్షేమం యుద్ధ ప్రాతిపదికైతే
చిలకలపూడి గోల్డు కవరింగు తంతైతే ముగుస్తుంది!
వెన్నుపూస, పొట్టను ఒకే సరళరేఖలో దాచి
ఆరడుగుల శరీరాన్ని గుడిసె భవంతిలో
మూడడుగులకు ముడిచాక
అగ్గిపెట్టెలో చీరను మడిచిన
అద్భుత కళ ఓడిపోయింది!
పూల కుండీలో వట వృక్షాలం
పొలం గట్లపై గరిక పోచలం-
వాడలో నడుస్తున్నప్పుడు వాడు
కురు సార్వభౌముడు
ఊళ్ళో నడుస్తున్నప్పుడు నేను
కాటి కాపరిని-
దేశం నిండా దేహాలే
ముఖమున్న దేహాల్ని వెతుక్కుంటున్నాను!
రేపు అనేది ముమ్మాటికీ నిజం
నేటి నిజాన్ని దాటాకే నిజమది

నేటిని రేపటికి వాయిదా వెయ్యడం
జీవితకాలం జార్చుకోవడం!
మారుతున్న వేళలో
ఒక నిట్టూర్పు ఉల్లిపొర కంటే తేలిక
ఒక నిట్టూర్పు ప్లాటినం కంటే పదును!
అందరి చిరునామాల్నీ తన వద్ద దాచుకుంటుంది రాత్రి
ఎవరి చిరునామాల్ని వారికి అందజేస్తుంది పగలు!
నెలలునిండిన బిడ్డకోసం నా ఎదురు చూపు
తూర్పు తల్లికి ఎన్నో నెల చెప్పనా?

# పడమటి సంధ్యారాగం

పండిన కాయ తొడిమెను చూసి భయపడుతుంది
బరువు మొయ్యలేక
భారాన్ని దించుకుంటుందని!
మన ఇద్దర్నీ ఇద్దరు పిల్లలు
భాగించి బరువు మోస్తున్నాక
మన మధ్య దూరం యిరవై మైళ్ళే ఐనా
యోచించని అడ్డంకులు
యోజనాల దూరం!
వారానికోసారి వచ్చి కనపడతానన్నమాట
అప్పు రేపుగా మారిపోయింది
అత్యవసర క్రియల్లో చిక్కిన దర్జీ
అతుకెయ్యాల్సిన నా చినుగుల లాల్చీ
అతి సాధారణ పనుల జాబితాలో చేర్చాక
ఆరునూరైనా అర్ధాంగిని కలవాలన్న నా ప్రయత్నం
అర్థాంతరంగా సోమవారం ఆగిపోయింది!
మర్నాడు శ్రీకారం చుట్టిన ప్రయాణాన్ని
చిగురించిన అనారోగ్యం అడ్డుకుంది!
లాకప్ మరణంపై ఎలుగెత్తిన ప్రజావళి
ఒకరోజు పౌరజీవనాన్ని స్తంభిస్తే
మరో రోజు కనపడని కళ్ళజోడు
ప్రయాణాన్ని వాయిదా వేసింది!
ఎవరూ లేక ఇంట కాపలా వుండి యింకో రోజు
చార్జీలు లేక శనివారం గడిచాయి!
కూరలమ్మే వాడు కోడర్ని

అప్పుతీర్చమని నిలదీసి అడిగాక
వార్జీ డబ్బు వాడి చేతిలో పెట్టి
వాయిదా ప్రయాణాల్లో ఆదివారం జమచేసుకున్నాను!
వారానికోసారి వచ్చి చూసే మాట నీటి మూటే
ఓసారి నువ్వైనా వచ్చి
ఈ వృద్ధాప్యాన్ని ఓదార్చి పోరాదూ?

# ధనుస్సు సంధించక తప్పదు

వేగుచుక్క ఆమెకు తోడు
ఆదమరిచిన నిద్ర ఆమె ఛాయకు రాదు!
ఊర బావికి కొండవీటి చాంతాళ్ళు ముడేసి
మునగని కడవని
పదే పదే ఆమె చేదడం చూసి
బాధపడ్డ గిలక ఏడ్పు
నిద్రించే ఊరికి కొక్కొరోకో అవుతుంది!
పెరటి చెట్లు రాల్చిన శవాల గుట్టల్ని
ఊడ్చి పూడ్చిన ఆమె అవయవాలు
పని చెయ్యని పనిముట్ల జాబితాకు చేరుతాయి!
చిగురును కన్నప్పుడు రెమ్మ ఎంత బాధపడిందో?
ఆకు రాలినప్పుడు కొమ్మ ఎంత ఏడ్చిందో?
ఆకులపై రాలిన కన్నీరు అందుకు తార్కాణం!
నేను బానిసనై మోస్తున్నాను
నువ్వు బానిస్వై చేస్తున్నావు
బానిసకాక బానిసంటూ
గుడ్డలు మోస్తున్న దండెం ఆమెతో అంటుంది!
మండని కట్టెలు కన్నీటికి తడిసి
పొయ్యి ఇల్లూ పొగలు నింపి
ఆమె కళ్ళెంట జీవాశ్రువుల్ని పారిస్తాయి!
కార్యక్రమానుక్రమణిలో
కించిత్తు జాగు జరిగినా
అపశ్రుతి పలికినా
భర్త హఠాత్ కోపాగ్నికి ఆమె శలభమై

పునర్భవం పొంది పనులు చేబడుతుంది!
త్రాసుకు వేలాడే రెండు పళ్ళాలూ ఆమే
తక్కెట్లో పురుషాధిక్యత తూకం వెయ్యడానికి
పడికట్టు రాళ్ళూ ఆమే
ఇల్లంతా ఆమె
ఇంటికి పరాయి ఆమె!
డేగలు కూనల్ని తన్నుకుపోతున్నప్పుడు
ధనుస్సు సంధించక తప్పదు!